

# వికీపీడియాలో రచనలు చేయుట

## అంతర్జాల విజ్ఞానసర్వస్వములో విషయాలను అభివృద్ధి చేయుటకు మార్గదర్శిని

వికీమీడియా ఫౌండేషన్

# వికీపీడియాలో రచనలు చేయుట — ప్రధాన భాగం

## వికీమీడియా ఫౌండేషన్



**2014**

**16 మే, 2023 న వికీసోర్సు నుండి ఎగుమతి చేసారు**

# వికీపీడియాలో రచనలు చేయుట



అంతర్జాల విజ్ఞానసర్వస్వములో విషయాలను అభివృద్ధి చేయుటకు మార్గదర్శిని

**వైజాసత్య**:నేను 2005 నుండి స్వచ్ఛందంగా వికీపీడీయాలో పనిచేస్తున్నాను. తెలుగు కంటే ఆంగ్లంలో బాగా పట్టు ఉన్నా, మాతృభాషపై అభిమానంతో స్థానిక వికీపీడియాలోనే ఎక్కువగా వ్రాస్తుంటాను. మంచి పరిశోధనాత్మక వ్యాసాలు వ్రాయటం ఇష్టం. మరుగునపడిపోయిన వ్యక్తులు, ఘటనల గురించి వెలికితీసి అందరికీ అందించటం నాకు సంతృప్తినిస్తుంది. అందుకే సాధారణంగా విస్మృత చారిత్రక వ్యక్తులను నా వ్యాసాలకు వస్తువులుగా ఎంచుకుంటూ ఉంటాను. వృత్తి రీత్యా పరిశోధకున్ని, ప్రవృత్తి రీత్యా శోధకున్ని. ఇవి రెండూ కలిసి నన్ను వికీపీడియన్ను చేశాయి.



ఈ ప్రపంచంలో ప్రతిఒక్కరూ ఉచితంగా, స్వేచ్ఛగా, జ్ఞానసర్వస్వమును పంచుకొనుటను ఊహించండి. అదే మా సంకల్పం -

2001 నుండి ప్రపంచం అంతటా ఉన్న సభ్యుల దిద్దుబాటలతో ముందుకు సాగుతున్న వికీపీడియా, సోదర వికీమీడియా ప్రాజెక్టుల



లక్ష్యం ఇదే. అందరి జ్ఞాన సర్వస్వమును పేర్చడానికి చాలా మంది మానవుల విజ్ఞానం కావాలి, మీదికూడా!

# దీనిలో వున్నవి:

ఈ మార్గదర్శిని మీరు వికీపీడియాలో కృషి చేయటాన్ని అంచెలంచెలుగా తెలుపుతుంది. అలా మీ జ్ఞానాన్ని ఇతరులతో ఉచితంగా, స్వేచ్ఛగా పంచుకోగలుగుతారు. మీకు కనబడే ముఖ్య విషయాలు



# వికీపీడియా అంటే ఏమిటి?

సహకార విధానంలో పనిచేసే ప్రాజెక్టుల చరిత్రలో వికీపీడియా ప్రధమస్థానంలో ఉంది. వందలాది భాషలలో లక్షల కొలది వ్యాసాలతో గల వికీపీడియాను కోట్లమంది ప్రతిరోజు చదువుతుంటారు.

వికీపీడియాలో ఇప్పటికే పలువ్యాసాలు ఉన్నాయి. అయినప్పటికీ ముఖ్యమైన విషయాలు వికీపీడియాలో అంతంత మాత్రంగానే వున్నాయి లేక అసలు లేనే లేవు. వికీపీడియాలో విషయాన్ని తాజాగా వుంచడానికి, ప్రస్తుతం మొలకలుగా ఉన్న వ్యాసాలను విస్తరించడానికి, కొత్త వ్యాసాలను సృష్టించడానికి మీలాంటి వారిపై ఆధారపడుతుంది. మీ వికీ కృషి వందలూ, వేలూ, ఒక్కోసారి లక్షలాది ప్రజలకు ప్రపంచ వ్యాప్తంగా అవగాహన పెంచడానికి తోడ్పడుతుంది.

మీరు వికీపీడియాలో మార్పు చేయడం ప్రారంభించినప్పటినుండి, మీరు లక్షల్లోవున్న ---వికీపీడియా సభ్యుల సముదాయంలో-- ప్రవేశిస్తున్నారన్నమాట. వీరందరూ తమ జ్ఞానాన్ని స్వేచ్ఛగా, ఉచితంగా వికీపీడియాలో పంచుకుంటున్నారు.

## WP:STATS

వికీపీడియా గురించి తాజా గణాంకాలు చూడాలనుకుంటున్నారా? బొమ్మలో చూపినట్లు వెతుకుపెట్టెలో WP:STATS టైపు చేసి ఎంటర్ కీ నొక్కండి . WP:STATS అనబడే పాఠ్యం వికీపీడియాలో దగ్గరి దారి అనమాట . ఇలాంటి దగ్గరిదారులను వెతుకుపెట్టెలో వాడడం ద్వారా కావలసిన పేజీలను సునాయాసంగా చేరుకోవచ్చు. ఈ కరపత్రంలో దగ్గరి దారులను | దగ్గరిదారి WP:STATS లాగా చూపిస్తాము.



వికీపీడియాలో మీ కృషి అంతా ఉచిత విషయాలవుతాయి. ఇవి అందరికీ అందుబాటులోకి వస్తాయి. వీటిని సహ సభ్యులు దిద్దుబాట్లు చేయవచ్చు. వీటిని స్వేచ్ఛా ఉచిత లైసెన్సుల ఆధారంగా పునరుపయోగించడానికి వీలు ఉంటుంది

# వికీపీడియా పేజీలలో విహరించడం

మీ పని ప్రారంభించడానికి వికీపీడియా వాడుకరి అంతర్వర్తి (User Interface) చూడండి. వికీపీడియా పేజీలలో విహరించడానికి ఇది సహాయంగా వుంటుంది.



అరటి వ్యాసం తొలి భాగం

చర్చ ప్రతి పేజీకి చర్చా పేజీ వుంటుంది. దీనిలో సభ్యులు వ్యాఖ్యలు, సలహాలు, ప్రతిపాదించే మార్పుల చర్చలు చేయవచ్చు, సహాయం కొరకు

అభ్యర్థించవచ్చు. సత్వర సహాయంకొరకు మీ వ్యాఖ్యతో పాటు {{సహాయం కావాలి}} అని చేర్చాలి లేక సంబంధిత సభ్యుల పేర్లకు వికీలింకులివ్వాలి.

- రచ్చబండ

ఇక్కడ వికీపీడియా వ్యవస్థలో వార్తలు, విధానాల చర్చల లాంటివి తెలుసుకుంటారు

- సహాయసూచిక

వ్యాసరచనకు ఉపకరించే మార్గదర్శక వ్యాసాలు వాటికి లింకులు ఉంటాయి. వ్యాస పేజీలలాగానే ఇవి కూడా వికీపీడియా సభ్యుల చేతనే రాయబడినవి.

- సముదాయ పందిరి

సభ్యులందరూ కలిసే పనిచేసే ప్రాజెక్టులు, సహాయం కోరుతున్న అంశాలు, సమావేశాల వివరాలు ఉంటాయి.

- సంప్రదింపు పేజీ

ఇక్కడ వికీ సంస్థతో సంప్రదింపులు చేయడానికి అవసరమైన అంశాల వివరణ ఉంటుంది.

- పరికరాల పెట్టె

ఈ విభాగంలో పేజీ, దాని చరిత్రను గురించిన అదనపు సమాచారాన్ని పొందటానికి ఉపకరణాలుంటాయి.

- దస్త్రం ఎక్కింపు

బొమ్మలు ఫైళ్లు చేర్చుటకు ఆదేశం

- ముద్రించండి/ఎగుమతి చెయ్యండి

ఒక పుస్తకాన్ని సృష్టించండి లేక పి.డి.ఎఫ్ క్రింద దిగుమతి చేసుకోండి

- భాషలు

ప్రదర్శితమైన పేజీకి 280 పైగా ఇతర భాషలలో సరిపోలిన పేజీ లింకులు

- భాషల అమరిక

ఈ అమరిక ద్వారా వికీపీడియాలో మెనూలకు, సందేశాలకు వాడే భాషను, టైపు చేయుటకు కీ బోర్డు నమూనాను ఎంపికచేయవచ్చు

- సవరించు

చాలామంది వీక్షకులు దీనిని గమనించరు. వికీపీడియా వ్యాసానికి ముఖ్యమైనది. పైనవున్న సవరించు బటన్ నొక్కి వ్యాస మొత్తాన్ని లేక విభాగం శీర్షిక పక్కన వరుసలో కనబడే సవరించు బటన్ నొక్కి ఆ విభాగాన్ని సవరించండి.



అరటి తొలి భాగం

- చరిత్రను చూడండి

వికీపీడియా వ్యాస చరిత్రలో సృష్టించినప్పటినుండి జరిగిన ప్రతిమార్పు వుంటుంది. ఎవరు, ఎప్పుడు దేనిని మార్చారు, ఏ రెండు రూపాలనైనా పక్కపక్కనే పోల్చిచూడవచ్చు.

- ఖాతాను తెరువు

మీరింకా చేయకపోతే , ఖాతాను తెరవండి. ఖాతాతో, మీరు చేసే కృషిని పురోగతిని గమనించడం సులభం, మీ కృషికి తోడ్పాటుగా సహ సభ్యులు ప్రత్యుత్తరమిచ్చినప్పుడు సూచనలు అందుతాయి

- వెతుకు

పేరుతో లేక పదం గల పేజీలను వెతకండి. ఇక్కడ దగ్గరిదారులు చేర్చడం ద్వారా ఈ పత్రంలో సూచించే కావలసిన పేజీలకు చేరుకోవచ్చు. ఉపయోగపడే ఒకి దగ్గరి దారి WP:HELP

- ◦ తెలుగులో వెతుకుట

దీనికొరకై ముందు భాషా అమరికలపై నొక్కి కీ బోర్డు నమూనాను లిప్యంతరీకరణకు (బొమ్మ కొరకు పే. 12 చూడండి) మార్చుకోండి. ఆ తరువాత ఆంగ్ల అక్షరాలు టైపు చేస్తే తెలుగులోకి మారతాయి (ఉదా te టైపు చేస్తే తె గా కనబడుతుంది). మరియు టైపు చేసిన అక్షరాలతో ప్రారంభమయ్యే వ్యాసాలు జారుడు పెట్టెలో కనబడతాయి. వాటిలో సులభంగా ఎంపికచేసుకోవచ్చు. ఇంకా కనబడే నీలి లింకులు, వ్యాసం అడుగున వుంటే వర్గాల లింకులు సహాయంతో వికీపీడియాలో మీకు కావలసిన పేజీకి త్వరితంగా చేరుకోవచ్చు. మరింత సహాయం కొరకు । దగ్గరి దారి WP:TH

# వివిధ రకాల కృషి

స్వచ్ఛంద కార్యకర్తలు రకరకాలుగా వికీపీడియాలో పనిచేస్తారు. వికీపీడియా ఇలా వుండడానికి అవసరమైన పనులు చూడండి



జెవిఆర్కె.ప్రసాద్: కొత్త సభ్యులకు స్వాగతం చెప్పటం, వారి సందేహాలకు జవాబివ్వటం



విశ్వనాథ్.బి.కె : ఛాయా మరియు రేఖాచిత్రాలను ఎక్కించడం, వ్యాసాలలో చిత్రాలు చేర్చి వివరించడం



భాస్కరనాయుడు: వ్యాసాల పాఠ్యాన్ని, రూపాన్ని

(copy edit) మెరుగు చేయడం



<u>సి.చంద్రకాంత రావు</u>: కొత్త పేజీలు, ఇటీవలి మార్పులు గమనించడం తగిన సూచనలు, సవరణలు చేయడం



<u>టి.సుజాత</u>: అనువాద వ్యాసాలపై కృషి



<u>రహ్మానుద్దీన్</u>: వికీపీడియాను నడిపిస్తున్న బహిరంగ మూలములు, ఉచిత సాఫ్ట్‌వేర్ అభివృద్ధి





వికీపీడియా పేజీ అభివృద్ధి కృషి

వైజాసత్య:వికీపీడియా విధానాలను చర్చ, వివాదాల పరిష్కారం



డా.రాజశేఖర్: కొత్త పాఠ్యాన్ని, వనరులను చేర్చడం.



అహ్మద్ నిసార్: వ్యాసాలను సమీక్షించుట, వాటిన అభివృద్ధికి సలహాలు ఇచ్చుట



విష్ణు: వికీపీడియా విద్యా ప్రణాళిక ద్వారా విద్యార్థులకు వికీపీడియా అవగాహన కలిగించుట, వికీపీడియా కృషికి విద్యార్థులను గుర్తించుట

# సవరణకు సిద్ధమవడం

విక్కీపీడియాలో ఎవరైనా దిద్దుబాట్లు చేయవచ్చు. అయినప్పటికీ అందుకు ప్రాథమిక నిబంధనలు ఉన్నాయి. మీరు దిద్దుబాట్లు



ప్రారంభించే ముందు అతిముఖ్యమైన అంశాలలో కొన్నిటిని గమనించండి:


వికీపీడియా వీలైనంతగా విశ్వసించదగినదిగా చేయటానికి, ఉపయోగకరంగా వుండడానికి చాలా కాలంనుండి జరిగిన చర్చల ఆధారంగా ఈ విధానాలు, మూల సూత్రాలను అభివృద్ధి చేశాము.

నిష్పక్షపాత ధోరణి

వికీపీడియాలో వ్రాసేవన్నీ నిష్పక్షపాత దృష్టితో వ్రాయాలి. ఏ పక్షం ప్రధానంగా భావించక, పక్షపాతం లేకుండా, ఖచ్చితమైన విశ్వసనీయమైన మూలాల ఆధారంగా విషయంపై అన్ని దృక్కోణాలు వివరించాలి. పిడి వాదనలు లేక ఒక దృక్కోణాన్ని సమర్థించేలా వ్రాయడం వికీపీడియా వ్యాసాల్లో చేయకూడదు.

మూల పరిశోధనలకు స్థానంలేదు

తేలికగా చెప్పాలంటే, వికీపీడియా మూల ఆలోచనలు చేర్చుటకు తగిన స్థలం కాదు. ఇతరుల విషయాన్ని గురించి విశ్వసనీయమైన మూలాలలో పేర్కొన్న వాటిని సంగ్రహం రూపంగా వికీపీడియాలో వ్రాయాలి. వ్యాసాలలో కొత్తగా విశ్లేషణలు చేర్చకూడదు. ఇప్పటికే ముద్రించిన వివరాలను కలపటం, విశ్లేషణం ఆధారంగా మూల వనరులు చెప్పేసారాంశం కంటే విస్తరిత సారాంశానికి చేరువయ్యేటట్లు రాయకూడదు.

కాపీ హక్కులు, గ్రంథచౌర్యము

సభ్యులు చేర్చిన అన్నీ ఉచిత లైసెన్స్ తో విడుదలవుతాయి కాబట్టి ఎవరికి, ఏ వ్యాసానికి యజమాన్య హక్కులు లేవు. మీ కృషి అంతా నిరంతరం దిద్దుబాట్లకు గురి అవటం, మరల పంపిణి జరుగుతుంది. కాపీహక్కులు గల వనరుల నుండి కొన్ని క్లుప్త వ్యాఖ్యలు మాత్రమే వికీపీడియాలో చేర్చవచ్చు. నేరుగా కాపీ చేయడం కానీ, చాలా పోలికలున్న రీతిలోచేర్చటం, గ్రంథ చౌర్యము, కాపీ హక్కుల వుల్లంఘునకు దారితీస్తుంది. ఇది వికీపీడియా కృషికి మచ్చుతెస్తాయి. వీటిన సవరించడానికి స్వచ్ఛంద సభ్యులకు చాలా సమయం పట్టేటట్లు చేస్తాయి. వికీపీడియాలో చేర్చవలసిన సమాచారం మీ స్వంత పదాలలో వ్రాయాలి. (ప్రజోపయోగపరిధి మరియు స్వేచ్ఛగా లైసెన్స్ గల విషయాలు వికీపీడియాలో సరియైన మూలాలను పేర్కొంటూ వాడవచ్చు)

విశ్వసనీయమైన వనరులు

వికీపీడియాలో గల సమాచారం విశ్వసనీయమైన, ముద్రితమైన వనరులనుండి ధృవీకరించుటకు తగినదై వుండాలి. మీరు వాడే వనరుల సమాచారాన్ని వ్యాసంలో పేర్కొనాలి. అప్పుడే ఇతరులు వాటిని తనిఖీ చేసుకోగలుగుతారు. నిజనిర్ధారణకు పేరు ప్రతిష్టలు కలిగిన మూడవ పక్షం వనరులు అనగా విద్యావిషయాల ముద్రణలు, సహపరిశోధకులచే సమీక్షింపబడిన విద్యావిషయక పత్రికలు, జాతీయ, అంతర్జాతీయ పత్రికల ను మాత్రమే వాడాలి. ప్రాధాన్యమున్న దృక్కోణాలన్నిటిని ప్రచురించే వనరులను వాడితే మంచిది. అరుదుగా ప్రచురించే లేక సమాజపు అంచులలో వుండే సముదాయాల వనరులను వాడవద్దు. విషయం గురించి, ఉన్నత నాణ్యతగల, విశ్వసనీయమైన వనరుల కోసం అన్వేషించండి.

వైరుధ్యాసక్తులు

మీరు పనిచేయుచున్న సంస్థ లేక మీకు ఉపాధి కల్పించినవారి గురించిన విషయాలపై మీకు వైరుధ్యాసక్తులున్నప్పుడు, వాటి గురించి వ్యాసాలను వ్రాయవద్దు.

# విజువల్ ఎడిటర్ తో సవరణలు

విజువల్ ఎడిటర్ తో మీరు చేసే సవరణలు చేసేటప్పుడే సరైన తీరులో కనబడతాయి కాబట్టి, విషయంపై ధ్యాస పెట్టవచ్చు. ఏ భాగాలను మార్చాలో వాటి పక్కన వున్న సవరించు బటన్ పై నొక్కి సవరణ ప్రారంభించండి.


విజువల్ ఎడిటర్ తో వ్యాస సవరణ -చొప్పింత అదేశాలవరుస

సవరణల పనిపట్టీ

ఈ పనిపట్టీ ద్వారా రూపం మార్చుటము, వనరులు బొమ్మలు చేర్చుటం మరియు పేజీలో ప్రత్యేక లక్షణాలుగల మూసలను (వ్యాస ప్రారంభంలో వుండే సమాచారపెట్టెలు లాంటివి) మార్చడం చేయవచ్చు. సవరణ పూర్తయిన తర్వాత **పేజీ భద్రపరచు** నొక్కండి

ప్రవేశిక

మొదటి వాక్యం విషయానికి నిర్వచనం ఇస్తుంది. వ్యాసంలోని విషయాలను సంగ్రహంగా తెలుపుతుంది. ఈ ఒక్క విభాగానికే శీర్షిక వుండదు.

సమాచారపెట్టె

కొన్ని వ్యాసాలకు సమాచారపెట్టెలలో వ్యాసానికి సంబంధించిన ముఖ్యాంశాలు చేర్చుతారు. ఉదాహరణకు దేశం, నగరాలు, గ్రామాలు వంటి వ్యాసాలకు కొన్ని గణాంక వివరాలను, ప్రదేశ వివరణా పటాలు, చిహ్నాలు, ఛాయాచిత్రాలు, ఇతరవివరాలు వుంటాయి.



విజువల్ ఎడిటర్ తో వ్యాస సవరణ-మూలము సవరించు



విజువల్ ఎడిటర్ తో వ్యాస సవరణ-మూస వాడుక సవరించు

బొమ్మలు

ఉచిత లైసెన్స్ జతపరచిన బొమ్మలు, ఇతర మీడియా ఫైళ్ళను వికీమీడియా కామన్స్ లేక స్థానిక ప్రాజెక్టులో చేర్చవచ్చు.

వ్యాసంలో విషయ వివరణల భాగం

శీర్షికలు - మరియు కొన్ని సార్లు ఉపశీర్షికలు వ్యాసాన్ని విభాగాలుగా విభజిస్తాయి. వాటితో విషయసూచిక తయారవుతుంది. ఒక్కో విభాగం సాధారణంగా విషయం గురించిన ప్రాధాన్యత గల అంశం తెలుపుతుంది. అందువలన చదువరులు వారికి కావలసిన సమాచారం కొరకు నేరుగా వెళ్లవచ్చు.

మూలాలు

వ్యాసంతో పాటుగా వరుసలలో మూలాల గుర్తులు, ఆ పాఠ భాగానికి మూలాన్ని తెలుపుతాయి. మూలాల వివరాలు వ్యాసం చివరలో మూలాల విభాగంలో కనబడతాయి.

మూస

మూసలనబడే మరల వాడగలిగే భాగాలు, సమాచారాన్ని ప్రామాణికంగా ప్రదర్శించడానికి, వ్యాస సమస్యలను వీక్షకులకు హెచ్చరిక ద్వారా తెలుపుటకు వాడతారు.

అనుబంధాలు, పాదసూచికలు

వ్యాసంలో ముఖ్య భాగాల తరువాత విభాగాలలో అదనపు సమాచారంగా సంబంధిత ఇతర వ్యాసాల లింకులు (ఇవీ చూడండి), మూలాలు వివరాలు( మూలాలు), మరింత సమాచారానికి ఇతర జాలస్థలుల జాబితా వుంటాయి.

# వికీ కోడ్ (మార్కప్) తో సవరణ

వికీపీడియా వ్యాసాలను సాంప్రదాయకంగా దిద్దుబాటు చేయడానికి వాడే రూపమే వికీ కోడ్(మార్కప్) . కొన్ని విహారిణి(Browser) లలో ఇదొక్కటే పనిచేస్తుంది. మీరు వీటి గురించి అర్థం చేసుకుంటే దీని ద్వారా విషయాన్ని సున్నితంగా కావలసిన తీరులో ప్రదర్శించవచ్చు . ఒక వ్యాసానికి వికీ మార్కప్ క్రింద చూపించబడింది. దీనిలోని కనబడే లక్షణాలు ఎన్ని విజువల్ ఎడిటర్ లో కనబడతాయో చూడండి.



వ్యాస తొలిభాగం సవరణ-వికీకోడ్(మార్కప్)

బొమ్మ

వికీ కామన్స్ లో లేక స్థానికంగా వున్న ఫొటో శీర్షిక కు ఇరువైపులా రెండు స్క్వేర్ బ్రాకెట్లు ఉంచి వ్యాసంలోకి బొమ్మ చేర్చవచ్చు. పైప్ చిహ్నం (|) ఉపయోగించి బొమ్మ ప్రదర్శితమయ్యే తీరుని ప్రభావితం చేయవచ్చు. సామాన్యంగా thumb అని వాడితే బొమ్మ చిన్నరూపంగా, ఒక శీర్షికతో ప్రదర్శిత మవుతుంది. [[File:Example.jpg|thumb|శీర్షిక]]



వ్యాస మధ్యభాగం సవరణ-వికీకోడ్(మార్కప్)

బొద్దు పాఠ్యం

ఒక పద బంధానికి ముందు, తరువాత మూడు ఒక గుర్తు కొటేషన్ మార్క్కులను కలిగి ఉంటే ఇది కనబడే తీరుని బొద్దు పాఠ్యం అంటారు. వ్యాస ప్రారంభంలో వ్యాస విషయానికి సాధారణంగా బొద్దు పాఠ్యం వాడుతారు. '''బొద్దు పాఠ్యం'''



మూలం వివరణ (Citation)

<ref></ref> టాగ్ ల మధ్య మూలం వివరం చేరుస్తారు. అప్రమేయంగా వరుససంఖ్య తో ఇది పై సూచికలాగా కనబడుతుంది. మూలాల విభాగంలో వివరం కనబడుతుంది. <ref> మూలం వివరణ</ref>

వ్యాస చివరిభాగం సవరణ-వికీకోడ్(మార్కప్)

అంతర్వికీ లింకులు

ఒక పదబంధం ముందు, తరువాత రెండు స్క్వేర్ బ్రాకెట్లు ఉంచితే ఆ పేరుతో గల వ్యాసానికి లింకు ఏర్పడుతుంది. మూసే స్క్వేర్ బ్రాకెట్ ముందు పైప్, దాని తరువాత పదబంధం చేరిస్తే ఆ పదబంధం లింక్ కనబడే పాఠ్యంగా మారుతుంది. [[ వ్యాసం పేరు| లింకుగా కనబడే పాఠ్యం]]

వాలు పాఠ్యం

ఒక పద బంధానికి ముందు, తరువాత రెండు ఒక గుర్తు కొటేషన్ మార్కులను కలిగి ఉంటే ఇది కనబడే తీరుని వాలు పాఠ్యం అంటారు. కొన్ని ప్రత్యేక పదాలను చూపించడానికి వాలుపాఠ్యం వాడతారు ''వాలు పాఠ్యం''

శీర్షిక

రెండు సమానం చిహ్నాల మధ్య ఉన్న పదబంధం శీర్షికగా ఉంటుంది. మూడు సమానం చిహ్నాల మధ్య ఉన్న పదబంధం ఉప శీర్షికగా ఉంటుంది.
== శీర్షిక==

మూస

మూసలను వాడుటకు రెండు బ్రేసులను మూస పేరుకి ముందు, తరువాత వాడతారు. మరల మరల వాడే భాగాలకు, విస్తృత ప్రయోజనలకు మూసలు ఉపయోగం. మూసపేరు తరువాత పైప్ తో వేరు చేస్తూ పరామితులను ప్రవేశపెట్టవచ్చు. వీటిని వాడితే మూస పనిచేసే విధానం లేక ప్రదర్శించే సమాచారం మారుతుంది. {{ మూస పేరు|పరామితి}}

మూలాలు

మూలాల జాబితా టాగ్ లేదా సమానమైన మూస పై సూచికలు కనబడే స్థానాన్ని నిర్ణయిస్తుంది. ఇది సాధారణంగా వ్యాసం చివరిలో గమనికలు లేక మూలాల విభాగంలో వుంటుంది. <మూలాలజాబితా/>

వెలుపలి లింకులు

తెరిచే ఒక స్క్వేర్ బ్రాకెట్, యు.ఆర్.ఎల్(URL) , ఖాళీ అక్షరము, కనబడవలసిన పాఠ్యం, మూసే ఒక స్క్వేర్ బ్రాకెట్ తో సాధారణ హైపర్ లింకు తయారవుతుంది. సాధారణంగా దీనిని వ్యాస ముఖ్య భాగాలలో వాడరు. మూలాలలో గాని **బయటి లింకులు** విభాగంలో వాడతారు. [http://www.example.com కనబడవలసిన పాఠ్యం]

వర్గాలు

వ్యాసానికి చివరగా వర్గం: తో ప్రారంభమయ్యే పదబంధం చుట్టూ రెండు స్క్వేర్ బ్రాకెట్లను చేర్చితే వ్యాసం ఆ వర్గంలోకి చేరుతుంది. ఒక విషయానికి సంబంధించిన వ్యాసాలను సమితులుగా నిర్వహించడానికి ఇవి ఉపకరిస్తాయి. [[వర్గం:వర్గం పేరు]]

మరింత మార్కప్ సహాయానికి, వికీ మార్కప్ పేజీ 15 లో చూడండి లేక వనరుల పేజీ చూడండి। దగ్గరిదారి WP:MARKUP

# విషయాలను చేర్చుట (మెట్టు తరువాత మెట్టు విధంగా)

ఈ బొమ్మలలో వాడుకరి:Navvula bullodu సవరణలు ఏ విధంగా కొత్త సమాచారాన్ని 'నిమ్మ' వ్యాసంలో చేర్చాడో చూడండి.



వ్యాసం నవ్వుల బుల్లోడు మార్చటానికి ముందు....



...సవరణలను భద్రపరచిన తరువాత

ఈ బొమ్మ లో నవ్వుల బుల్లోడు చేర్చిన విషయం వాడిన వికీకోడ్(మార్కప్) కనబడుతుంది.

ఈ మెట్లు వాడి మీరు వికీపీడియా వ్యాసానికి విషయం చేర్చవచ్చు.

వ్యాస సవరణ చిత్రం

**మెట్టు 1:** మీరు అదనపు సమాచారం ద్వారా విస్తరించటానికి ఆసక్తి ఉన్న వ్యాసాన్ని ఎంచుకోండి.

**మెట్టు 2:** ప్రస్తుత వికీపీడియా వ్యాసం కంటే ఎక్కువగా వివరమున్న విశ్వసనీయమైన మూలాన్ని వెతకండి. దీనికి అంతర్జాలం శోధనా యంత్రం, స్థానిక గ్రంథాలయాలు, ఆంగ్ల భాషలో వ్యాసం(వున్నట్లైతే) మూలాలు ఉపయోగపడవచ్చు.[2]

**మెట్టు 3:** ఇప్పుడు మొదలవుతుంది తమాషా భాగం. సవరించు అన్న బటన్ నొక్కండి![3]

**మెట్టు 4:** ఇప్పటికే లేని వివరాలను చేర్చండి. మీరు తెలుసుకున్న వనరులనుండి వ్యాసంలో చేర్చాలనుకున్న సమాచారాన్ని సంగ్రహరూపంలో మీ స్వంతపదాలకూర్పుతో చేర్చండి. [4]

**మెట్టు 5:** మీరు కొత్తగా చేర్చిన పాఠ్య భాగానికి చివరలో, ఆధారమైన మూలపు వివరాన్ని చేర్చండి. సవరణ పనిముట్ల పట్టీ లో (వికీమార్కప్ లేక విజువల్ ఎడిటర్) మూలము అనే బొమ్మని నొక్కుటద్వారా మూలం వివరాన్ని చేర్చవచ్చు. శాశ్వతంగా వుండే అంతర్జాల వనరులైతే చిరునామా(URL)తో పాటు శీర్షిక, పరిశీలించిన

తేదికూడా చేర్చండి. దినపత్రికలలో ప్రచురించే ప్రముఖ విషయాలైతే పత్రిక పేరు,ప్రచురణ తేది, సంచిక, శీర్షిక వివరాలు చేర్చాలి 5

**మెట్టు 6:** " సారాంశం" క్రింద ఉన్న పెట్టెలో మీ సవరణకు శీర్షిక వ్రాయండి. దీనిలో సమాచారం చేర్చినప్పుడు '+', తొలగించినప్పుడు ' -' వాడడం సాంప్రదాయం. దిద్దుబాటు సారాంశం సహాయంతో, ఇతర సభ్యులు మీరు చేసిన దిద్దుబాటు గురించి సులభంగా తెలుసుకుంటారు.6. (విజువల్ ఎడిటర్ అయితే భద్రపరచు (మెట్టు 7 చూడండి) నొక్కిన తరువాత సారాంశం చేర్చాలి)

**మెట్టు 7:**ఇప్పుడిక భద్రపరిచే సమయం ఆసన్నమైనట్లే. **పేజీని భద్రపరచు** బటన్ నొక్కండి. (వికీమార్కప్)

ఒకవేళ పై అంశాలు చేసే క్రమంలో పొరపాటు ఏదైనా జరిగితే ఆందోళన పడకండి. తరువాత మీరు అదనపు దిద్దుబాట్లతో వాటిని సరిదిద్దవచ్చు లేకుంటే వ్యాసాన్ని పూర్వపు స్థితికి తీసుకురావచ్చు.

# వాడుకరి, వాడుకరి చర్చ పేజీలు

ఖాతా తెరచునప్పుడు వచ్చే పెట్టెలో చేర్చవలసిన వివరాల బొమ్మ చూడండి. దీనిలో వాడుకరి పేరుని ఆంగ్లంలో వుంచుకోవటం (సంతకం తెలుగులో కనబడేటట్లు తరువాత అభిరుచులలో అమరిక ద్వారా చేసుకోవచ్చు) , ఈమెయిల్ చేర్చటం మంచిది. ఖాతా కంప్యూటర్ ప్రోగ్రామ్ ద్వారా చేయటం లేదని నిర్ధారించటానికి కేప్చా అనగా వ్యక్తి మాత్రమే సులభంగా అర్థం చేసుకోగల బొమ్మలోని అక్షరాలు సంబంధిత పెట్టెలో చేర్చాలని గమనించండి.

ఆ తరువాత భాష అమరికలలో మీకు కావలసిన కీబోర్డు నమూనా (ఆంగ్ల టైపు అనుభవమున్న వారికి లిప్యంతరీకరణ సులభంగా వుంటుంది.) ఎంపిక చేసిన కీబోర్డు నమూనాకు, ఆంగ్లకీబోర్డుకు కంట్రోల్+M వాడి మారవచ్చు. మీరిప్పటికే కంప్యూటర్ లో తెలుగు కీ బోర్డు వాడుతుంటే అదే కొనసాగించవచ్చు. మరింత సమాచారానికి దగ్గరిదారి WP:TH చూడండి.

ఖాతా తెరచుట

వికీపీడియాలో వ్యాసాలే కాక ఇతర పేజీలు కూడా ఉంటాయి. మీరొకసారి దిద్దుబాట్లు ప్రారంభించిన తరువాత ఇతర సభ్యులు మీ గురించి కొంత తెలుసుకోవడానికి, మీరు మీ వాడుకరి పేజీ తయారు చేసుకోవాలనుకోవచ్చు. పుట పైభాగంలో కుడి వైపున (ఒకవేళ మీరు ప్రవేశించి ఉంటే) మీరు, మీ వాడుకరి పేరును చూడవచ్చు. మీ పేరుపై నొక్కి మీ వాడుకరి పేజీ చేరుకోవచ్చు. మీరు మీ వాడుకరి పేజీని సృష్టించుకోని పక్షంలో మీ పేరు నీలి రంగుకు బదులుగా ఎర్ర రంగులో కనిపిస్తుంది.



కీబోర్డు నమూనా ఎంపిక



వాడుకరి ఆదేశాల వరుస

ఇంకా సృష్టించక పోతే మీ వాడుకరిపేజీ ఖాళీగా కనబడుతుంది. మీ గురించి మీరు ఇష్టపడినంత (కొద్దిగా కాని,ఎక్కువ కాని) తెలియజేయడానికి సరైన ప్రదేశం ఇది మాత్రమే. మీ ఆసక్తులు, మీకు సంబంధించిన ఇతరవివరాలు ఇందులో వ్రాయవచ్చు. మీరు పేజీని భద్రపరచగానే మీ పేరు నీలిరంగుకు మారుతుంది.



వాడుకరి పేజీ సృష్టించునప్పుడు కనబడే సందేశం



వాడుకరి పేజీ

మీతో ఇతరులు చర్చించడానికి అనువుగా మీకు ఒక చర్చా పేజి ఉంటుంది. దీనిలో ఇతర సభ్యులు మీకు సందేశాలివ్వవచ్చు. ఒకవేళ మీరు ఇతర సభ్యులతో సంప్రదించాలని అనుకుంటే వారి చర్చా పేజీలో ఒక సందేశం వ్రాయండి. మీరు చర్చా పేజీలో మీ సందేశం తరువాత తప్పక సంతకం చేయాలి. సవరణ పెట్టెలో వికీ సంతకం చేయడానికి ఉపకరించే చిహ్నం ను గమనించండి. మీరు ఈ బటన్ నొక్కినట్లైతే (~~~~) ఇలా వరుసగా నాలుగు టిల్డేలు చేర్చబడతాయి. భద్రపరచితే సందేశం తరువాత మీ పేరు, తేదీ మరియు సమయం (అంతర్జాతీయ ప్రామాణిక కాలమానం) కనబడుతుంది.

గమనిక: వ్యాసానికి సంబంధించిన చర్చలు ఆ వ్యాస చర్చా పేజీలోనే చేస్తూ, సంబంధిత సహ సభ్యుల వాడుకరి పేజీలకు లింకులివ్వడం ద్వారా వారికి ఎకో వ్యవస్థ ద్వారా సందేశాలు చేరే విధానం వాడుకొనుట మంచి పద్ధతి. వాడుకరి చర్చ పేజీలలో ఒక్కవాడుకరికి మాత్రమే సంబంధించిన విషయాలు చర్చించటం, చర్చ అంతా ఒకే

చోట వుండడానికి చర్చ ప్రారంభించిన పేజీలో స్పందన వ్రాసి, ఎవరికైతే స్పందన రాస్తున్నారో వారి వాడుకరి పేజీని స్పందనలో లింకుగా చేర్చటం మంచి పద్ధతి.

## సముదాయంతో సంప్రదింపులు

ప్రతి పేజీకి అనుబంధంగా ఒక చర్చాపేజీ వున్నది. ఈ చర్చాపేజీని, అభిప్రాయాలు ప్రకటించుటకు, కొత్త వనరులను సూచించుటకు, సమస్యలను ఉదహరించుటకు, సభ్యులకు అంగీకారం కాని మార్పుల గురించి చర్చించుటకు వాడవచ్చు.

చర్చ:నిమ్మ దిద్దుబాటు

వ్యాస చర్చాపేజీలో వ్యాఖ్యలో సహ సభ్యునికి సందేశం పంపటానికి వారి వాడుకరి పేజీ కి లింకు ఇవ్వడం

చర్చ:నిమ్మ

వ్యాస చర్చాపేజీలో వ్యాఖ్య (పై చిత్రంలో సవరణ కనబడేతీరు)




సూచనల వ్యవస్థ తెరపట్టు

ఒక ముఖ్యమైన మార్గదర్శకం ఏమంటే, వికీపీడియా సముదాయ చర్చలలో గౌరవపూర్వకంగా మరియు మర్యాదతో వ్యవహరించాలి. ఒకవేళ మీరు ఒక విషయం పట్ల విభేదించే పక్షంలో, మీలాగే సహ సభ్యులు వికీపీడియా లక్ష్యానికి కట్టుబడి మంచి ఉద్దేశంతోనే వ్యవహరిస్తున్నారని అనుకోవాలి. చర్చలలో సభ్యుని వ్యక్తిత్వంపై కాక చర్చావిషయం పట్ల ప్రాధాన్యత చూపండి.

చూడండి! కొత్త సందేశం! ఎవరైనా మీ వాడుకరి పేరుని పేర్కొన్నప్పుడు, మీ సవరణకు కృతజ్ఞతలు తెలిపినప్పుడు, లేక మీ వాడుకరి చర్చా పేజీలో సందేశం చేర్చినప్పుడు సందేశాల హెచ్చరిక ఎర్రరంగులో కనబడుతుంది. 1 దీనిని నొక్కినపుడు సూచనల పెట్టె తెరచుకొని సూచనలు చూడవచ్చు.



# వికీపీడియా వ్యాసం నాణ్యత అంచనావేయటం

వికీపీడియా వ్యాసాల నాణ్యతలో చాలా తేడాలుంటాయి. కొన్ని వ్యాసాలు చాలా బాగా ఉంటాయి, కానీ కొన్ని కొద్దిపాటివివరంతో, స్పష్టత లేకుండా వుంటాయి, లేదా పక్షపాతంతో కూడిన దృక్కోణాలను కలిగి వుంటాయి, లేదా పాతబడిన సమాచారంతో వుంటాయి. సాధారణంగా, అధిక నాణ్యతగల రచనలు ఈ లక్షణాలు కలిగి వుంటాయి:

- ప్రవేశికలో సులభంగా అర్థమయ్యే వ్యాస సారాంశం,
- ఒక స్పష్టమైన నిర్మాణం,
- విషయం గురించి సమతుల్యత
- తటస్థ దృక్కోణం
- విశ్వసనీయమైన మూలాలు

వ్యాసం నాణ్యత గురించి అదనపు సమాచారం కొరకు " వికీపీడియా నాణ్యత అంచనా" (Evaluating Wikipedia) కరపత్రం చూడండి ( తరువాతి విభాగం చూడండి)

# అదనపు వనరులు




**Evaluating Wikipedia: వికీపీడియా నాణ్యత అంచనా: వ్యాస మార్పుల క్రమం, వ్యాసాల నాణ్యతను అంచనా చేయడం** వ్యాసాలు ఎలా పరిణామం చెందుతాయి, మంచి నాణ్యత గల వ్యాసాల అంశాలు, నాణ్యత లేని వ్యాసాల సంకేతాలు అన్ని ఈ మార్గదర్శి లో ఇవ్వబడ్డాయి. http://education.wikimedia.org/evaluating




**వికీపీడియాకు బొమ్మలు చేర్చడం: వికీమీడియా కామన్స్ తోడ్పాటుకు అవసరమయ్యే చేపుస్తకం.** వికీమీడియా కామన్స్, వికీపీడియా లో వాడే దస్త్రాలనిల్వ గురించిన ఈ పుస్తకానికి తోడుగా వున్న పుస్తకం. ఈ కరపత్రం కామన్స్ ఏమిటి, ఫైళ్ళను ఏవిధంగా ఎక్కించాలి, ఫైళ్ళను ఏవిధంగా ఉపయోగించాలి, ఉచిత లైసెన్స్ ల ప్రాథమిక అంశాలను తెలుపుతుంది. http://education.wikimedia.org/illustrating




**Instructor basics: బోధకుడి కొరకు ప్రాథమికాంశాలు : వికీపీడియాను బోధనోపకరణముగా ఎలా మార్చాలి.** ఈ పుస్తకం విద్యాబోధకులు వికీపీడియా కృషిలో విద్యార్థులను భాగస్వామ్యం చేయటానికి మంచి పద్ధతులను తెలుపుతుంది. తమ పాఠ్యప్రణాళికలో భాగంగా వికీపీడియా వాడడానికి వివరాలు తెలుపుతుంది. http://education.wikimedia.org/instructorbasics

# వికీమార్కప్ మార్గదర్శిని

క్రిందనివ్వబడిన ఉదాహరణలు వికీపీడియాలో వికీమార్కప్ వాడి వ్యాస సవరణలు చేస్తున్నప్పుడు అవసరమయిన దృశ్యరీతులకి సంబంధించినవి. మరింత సహాయానికి , చూడండి | దగ్గరిదారి WP:MARKUP

| **వివరణ** | **మీరు టైపు** చేసేది | **భద్రపరిచిన** తదుపరి కనిపించేది |
|---|---|---|
| వాలు | "వాలు పాఠ్యం" | *వాలు పాఠ్యం* |
| బొద్దు అక్షరాలు | '"బొద్దు పాఠ్యం'" | **బొద్దు పాఠ్యం** |
| విభాగ శీర్షికలు | ==చరిత్ర==<br>===వర్ణన===<br>====ఉత్పాదన==== | **చరిత్ర**<br>**వర్ణన**<br>**ఉత్పాదన** |

| | | |
|---|---|---|
| తెలుగు వికీపీడియాలోని మరో వ్యాసానికి లంకె (అంతర వికీ లింకు) | [[విజయవాడ]] | విజయవాడ |
| శీర్షికకు భిన్నమయిన పాఠ్యంతో లంకె | [[హైదరాబాదు\|రాజధాని]] | రాజధాని |
| వికీపీడియా వెలుపల పేజీలకు లంకె వేయడం (బయటి లింకులు) | [http://andhrabharati.com ఆంధ్రభారతి జాలగూడు ] | ఆంధ్రభారతి జాలగూడు |
| బుల్లెట్ జాబితా | *కృష్ణా<br>*గోదావరి | • కృష్ణా<br>• గోదావరి |
| క్రమ జాబితా | #ఆసియా<br>#యూరప్ | 1. ఆసియా<br>2. యూరప్ |
| శీర్షికతో కూడిన బొమ్మ | [[Image:Example.png\|thumb\|బొమ్మశీర్షిక]] |  |

| | | |
|---|---|---|
| | | బొమ్మశీర్షిక |
| చర్చల్లో సంతకం | ~~~~ | వాడుకరిపేరు (చర్చ) 04:50, 1 నవంబరు 2013 (UTC) |
| మూలాలు చేర్చడం | <ref>[http://example.org/ వివరణ పాఠ్యం. </ref> | [1] |
| మూలాలను వ్యాసం చివర చూపించడం | <references /> | 1. ↑ వివరణ పాఠ్యం. |

# వికీపీడియా పదావళి

ఉచిత లైసెన్స్

వికీపీడియాలోని విషయాలను ఎవరైనా, ఎటువంటి లక్ష్యానికైనా వాడుకోవడానికి, అధ్యయనం, నకలు, నకళ్లు పంపిణీ చేయడానికి, సవరణలు, అభివృద్ధి చేయడానికి, అటువంటి తద్భవాలను పంపిణీ చేయడానికి, అలాగే బొమ్మలు, ఇతర విషయాలను ఏవైనా ఎక్కడైనా ఉచితంగా వాడుకోవడానికి, మార్పులు, అభివృద్ధిచేయడానకి, ప్రచురించి ప్రతులను పంచిపెట్టడానికి అనుమతి ఇవ్వడమేగాక వాటిని ఏలాంటి ఉపయోగానికైనా ఎవరితోనైనా పంచుకోవడానికి అనుమతించే నకలు హక్కుల లైసెన్స్. వికీపీడియా మరియు దానిలోని ప్రతి కృషి " క్రియేటివ్ కామన్స్ ఆట్రిబ్యూషన్/షేర్-అలైక్

గుర్తింపులు

- ఆంగ్ల మూల పాఠ్యం: Sage Ross(WMF)
- ఆంగ్ల రూపలావణ్యం:<TBD>
- తెలుగుసేత:టి.సుజాత,అహ్మద్ నిసార్, రహ్మానుద్దీన్, అర్జున తదితరులు
- తెలుగు వికీపీడియా సంచికకు మార్పులు, సంపాదకత్వం: అర్జున
- సహకారం:తెలుగు వికీపీడియా మరియు వికీసోర్స్ సభ్యులు



వికీమీడియా భారతదేశం చాప్టర్ ( నమోదు చేయబడిన పేరు వికీమీడియా చాప్టర్) ఒక

లైసెన్స్ 3.0 " అనే ఉచిత లైసెన్స్ కు కట్టుబడి జరుగుతుంది. | మరింత సమాచారానికి దగ్గరి దారి WP:CC-BY-SA

చరిత్ర

ఇక్కడ సభ్యులు చేసిన మార్పుల వివరాల జాబితా ఉంటుంది. వికీపీడియా వ్యాస మార్పుల నమోదు పేజీ చరిత్రను చూడండి అనే బటన్ ద్వారా చేరవచ్చు. లంకెలను చూడవచ్చు. దానిలో (ప్రస్తుత - గత) బటన్ లను నొక్కడం ద్వారా ఏ రెండు రూపాల మధ్య తేడాలను చూడవచ్చు. పాత రూపాలను తిరిగి ప్రదర్శితమయ్యే రూపంగా చేయవచ్చు.

చర్చాపేజీ

ఒక వ్యాసానికి లేక ఇతర వికీపీడియా పేజీల చర్చలకు కేటాయించిన స్థలం. మీరు ఇతర సభ్యులతో సంబంధిత పేజీలో విషయం గురించి చర్చించవచ్చు.

పరామితి

ఒక పైపు చిహ్నం (|) ఉపయోగించి పదబంధాలను వేరు చేసేది. దీని ద్వారా బొమ్మలు, మూసలు మరియు ఇతర వికీ మార్కప్, వ్యాస పేజీలో ప్రదర్శితమవటాన్ని నిర్దేశించవచ్చు.

మార్కప్(చిహ్నాలు)

వికీపీడియా పుటను తయారుచేయడానికి ఉపయోగించే ప్రత్యేక సాంకేతిక చిహ్నాలు. ప్రాథమికాంశాలకు మార్కప్ మార్గదర్శిక

స్వలాభాపేక్ష లేని సంస్థ. సంఘం కార్యాలయం, బెంగుళూరు పట్టణ జిల్లా వద్ద 3 జనవరి 2011 రిజిస్టర్ చెయ్యబడింది. భారతీయులకు స్వేచ్ఛా విజ్ఞానాన్ని అందుబాటులో ఉంచడం, అటువంటి సాధనాలకు తోడ్పాడటానికి, ప్రజల నైపుణ్యాలను మెరుగు పరచేలా చేయడం ఈ సంస్థ ముఖ్య లక్ష్యం. ఇది వికీపీడియా మరి ఇతర ప్రాజెక్టులు నడిపే వికీమీడియా ఫౌండేషన్ తో కలిసి పనిచేస్తున్నది. వికీమీడియా చాప్టర్ కు వికీపీడియా, ఇతర ప్రాజెక్టులలో చేర్చే విషయాలపై ఏ విధమైన నియంత్రణ లేదు. అలాగే ఈ ప్రాజెక్టులను నడిపే సర్వర్లపై నేరు ఆధిపత్యం లేదు.




వికీమీడియా ఫౌండేషన్ 149 న్యూ మోంట్గోమరీ స్ట్రీట్, థర్డ్ ఫ్లోర్ శాన్ ఫ్రాన్సిస్కో, సిఎ 94105, యుఎస్ఎ. వికీమీడియా ఫౌండేషన్ ఒక లాభాపేక్ష లేని సంస్థ. ఇది వికీపీడియా, ఇతర ఉచిత విషయాలు గల వెబ్సైట్లను నడుపుతుంది.

వేరేగా పేర్కొనకబోతే అన్ని బొమ్మలు వికీమీడియాకామన్స్ నుండి సిసి-బై-ఎస్ఎ (CC-BY-SA) లేక ఇతర సార్వజనీయమైన లైసెన్సులతో విడుదల చేయబడినవి. పాఠ్యము క్రియేటివ్ కామన్స్ యాట్రిబ్యూషన్-షేర్ ఎలైక్ లైసెన్స్ v.3.0 లేక దాని తరువాత రూపంతో(Creative Commons Attribution-ShareAlike

(పేజి 15) లేక మరిన్ని వివరాలకు| దగ్గరిదారి H:MARKUP

మూస

ఒకపేజీలో ఉన్న విషయాన్ని మరొకపేజీలో చేర్చడానికి సులభమైన పద్ధతి. ఒకే తరహా విషయ వివరణలను పలుపేజీలలో చేర్చవలసిన అవసరం ఏర్పడినప్పుడు మూసలను తయారు చేసి వాటిని వాడుతూ ఉంటారు. వాడుటకు సూచనల కొరకు , చూడండి| దగ్గరి దారి H:T

మొలక

విస్తరణకు బాగా అవకాశమున్న చిన్న వ్యాసం. కొత్త సభ్యులు వికీపీడియాలో రచనలు చేయడం ప్రారంభించేటప్పుడు మొలకలను విస్తరించడం చాలా మంచి పని.

వాడుకరి పేజీ

ఇది వికీపీడియా సభ్యునికి వ్యక్తిగత పేజీ. ఇది వాడుకరి: అనే పదంతో ప్రారంభమయి తరువాత వాడుకరి పేరుని కలిగి వుంటుంది. వికీపీడియా సభ్యులు తమ వివరాలు, ఆసక్తులను అవసరమని భావించినంతవరకు చేర్చవచ్చు. పనిచేసిన లేక చేయబోయే వ్యాసాలు, ఇతర వివరాలు చేర్చవచ్చు.

వికీకామన్స్

వికీపీడియా, దాని అనుబంధ ప్రాజెక్టుల లో విషయాన్ని వివరించడానికి అవసరమైన ఛాయాచిత్రాలను, వీడియోలను మరియు License v.3.0) లింకు విడుదలచెయ్యబడింది.

వికీమీడియా ఫౌండేషన్, ఇతర సంస్థల వ్యాపార చిహ్నాలు మరియు గుర్తులు క్రియేటివ్ కామన్స్ లైసెన్స్ కు లోబడవు. వికీమీడియా ఫౌండేషన్, వికీపీడియా, కామన్స్, మీడియావికీ, విక్షనరీ, వికీబుక్స్, వికీసోర్స్, వికీన్యూస్, వికీకోట్, వికీవర్శిటీ, వికీస్పీసీస్, మెటా వికీలు నమోదు చేయబడిన లేక నమోదు చేయబడుతున్న వ్యాపార చిహ్నాలు.

మరింత సమాచారానికి, మా వ్యాపార చిహ్నాల విధానం లింకు చూడండి: ఇతర ప్రశ్నలకు మరియు లైసెన్స్ షరతులకు లేక వ్యాపార చిహ్నాల విధానానికి వికీమీడియా ఫౌండేషన్ న్యాయశాఖకు ఈమెయిల్ (legal@wikimedia.org) చేయండి. వికీమీడియా భారతదేశం గురించి, ఈ తెలుగు పుస్తకం గురించి సూచనలు చేయదలిస్తే వికీమీడియా భారతదేశానికి ఈ మెయిల్ (chapter@wikimedia.in) చేయండి.

ఇతర ఫైళ్లను మీరు స్వేచ్ఛా నకలు హక్కుల అనుమతితో భద్రపరిచగల భాండాగారం.

వికీపీడియన్

వికీపీడియా అభివృద్ధికి కృషి చేసే వ్యక్తి. సామాన్య పర్యాయపదాలు: సంపాదకుడు, వాడుకరి, రచయిత, సముదాయ సభ్యుడు

సమాచారపెట్టె

విషయాన్ని గురించిన ముఖ్య మైన సమాచారంతో తరచు వ్యాసం మొదటి భాగంలో వాడే పెట్టె. మూసలకు సామాన్య రూపమే సమాచార పెట్టెలు.

సారాంశం (సవరణ)

వికీపీడియా వ్యాసంలో మార్పు గురించిన వివరణ, ఇతర వాడుకరులు, వ్యాస సవరణల క్రమమును గమనించడానికి వీలుగా సవరణ ఉద్దేశ్యాన్ని తెలుపుతుంది.

# ఇవీ చూడండి

- 2021 లో తాజాపరచిన అంచెలంచెల బోధన
- వికీపీడియా స్వయంశిక్షణ, 2010 సంచిక

# ఈ డిజిటల్ విడుదల గురించి

ఈ ఎలెక్ట్రానిక్ పుస్తకం (ఈ-పుస్తకం) వికీసోర్స్ అంతర్జాల గ్రంథాలయం [1]. అన్ని ప్రచురణలు, నవలలు, కవితలు,పత్రికలు, లేఖలు .. ఉచితంగా అందుబాటులో తేవాలన్న లక్ష్యంతో స్వచ్ఛంద సేవచేసే ఔత్సాహికులతో తయారుచేయబడింది.

మా పుస్తకాలు ఉచితంగా చదువుకోవటానికి అందచేస్తాము. చాలావరకు స్వేచ్ఛా నకలుహక్కులుగల పుస్తకాలు మాద్వారా లభిస్తాయి. స్వేచ్ఛానకలుహక్కుల పుస్తకాలను(వాణిజ్య అవసరాలకొరకు కూడా) ఈ Creative Commons Attribution-ShareAlike 3.0 Unported [2]లేక GNU FDL[3]నియమాలకు లోబడి వాడుకోవచ్చు. ఈ పుస్తకం నకలుహక్కుల గురించి మరింత తెలుసుకోవటానికి వికీసోర్స్ లో చూడండి.

వికీసోర్స్ కొత్త సభ్యులకొరకు ఎప్పుడూ వేచివుంటుంది. ఈ పుస్తకం తయారీలో కొన్ని దోషాలు చేరివుండవచ్చు. మీరు వీటిని ఈ పేజీలో[4] తెలియచేయండి.

ఈ పుస్తకానికై క్రింది సభ్యులు కృషి చేశారు:

- Gokulellanki
- CommonsDelinker
- Arjunaraoc
- Visdaviva
- Sakurambo~commonswiki
- DarkEvil

- AKoval (WMF)
- Ldavis (WMF)
- Frank Schulenburg
- Frank Schulenburg (Wikimedia Foundation)
- Aude
- Artem Karimov
- JVRKPRASAD
- Navvula bullodu
- Bhaskaranaidu
- రహ్మానుద్దీన్
- TFlanagan-WMF
- File Upload Bot (Magnus Manske)
- Maksim
- Denniss
- Nrgullapalli
- Zscout370

---

1. ↑http://te.wikisource.org
2. ↑http://www.creativecommons.org/licenses/by-sa/3.0
3. ↑http://www.gnu.org/copyleft/fdl.html
4. ↑http://wikisource.org/wiki/Wikisource:రచ్చబండ